841

ఆర్య సమాజమునకు
వేదములు పరమ ప్రమాణములు
మఱి

# వేదములు చెప్పు ధర్మమేమి?

కర్త :

టి. సూర్యనారాయణ

ప్రకాశకులు :
గాయత్రీ ఆశ్రమము



"వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట మరియు వినుట, వినుపించుట ఆర్యులందరికి (శ్రేష్ఠ మానవు లందరికి) పరమ ధర్మము."

—మహర్షి దయానంద.

841

ఆర్య సమాజమునకు
వేదములు పరమ ప్రమాణములు
మఱి

# వేదములు చెప్పు ధర్మ మేమి ?

కర్త :

టి. సూర్యనారాయణ

ప్రకాశకులు :
గాయత్రీ ఆశ్రమము

గాయత్రీ గ్రంథమాల - 13
ప్రథమ ముద్రణము 2000

ప్రమోదూత విజయదశమి
29 సెప్టెంబరు 1990

మూల్యము : రు. 1-00
(పోష్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :
గాయత్రీ ఆశ్రమము
12-10-586/6, వ్యాస్‌నగర్
సీతాఫల మండి, సికింద్రాబాద్-500 361

ముద్రణ :
అమరనాథ్ ప్రింటర్స్, సీతాఫలమండి




## ఆర్యసమాజమునకు
## వేదములు పరమ ప్రమాణములు
## మఱి

# వేదములు చెప్పు ధర్మ మేమి ?

—టి. సూర్యనారాయణ

ఆర్యసమాజము మహర్షి దయానందునిచే క్రీ. శ. 1875 సంవత్సరము ఏప్రిల్ 10 వ రోజు స్థాపించబడినది. ఆర్యసమాజము క్రొత్త సిద్ధాంతము లెవ్వి ప్రతిపాదించ లేదు. ఇది యొక సంప్రదాయము కాని, మతము కాని

కాదు. వేద ధర్మమును హేతుబద్ధముగా ప్రతిపాదించిన నొక విప్లవాత్మక సంస్థ. మానవతా వాదమును సంచాలనము గావించెను.

వేదములు సృష్ట్యాదిలో మానవ కల్యాణమునకై ఋషుల ద్వారా పరమేశ్వరుడిచ్చిన నొక దివ్యజ్ఞానదీపిక. జలము, వాయువు, దుంపలు మొదలగునవి ప్రాణుల మనుగడ కొఱకై యిచ్చినట్లే ఋగ్యజుస్సామాథర్వ వేదములు మానవ కల్యాణమునకై జ్ఞానజ్యోతికై పరమేశ్వరు డొసంగెను. అగ్నిఋషి ద్వారా ఋగ్వేదము, వాయువుచే యజుర్వేదము, ఆదిత్యమహర్షిచే సామవేదము, అంగీరసునిచే అథర్వవేదము ప్రచారము చేయబడినవి. ఇవి మానవ ధర్మమును ప్రబోధించు సర్వోత్తమమైన గ్రంథములు. ఇవి ఒక మతానికిగాని, ఒక జాతికిగాని లేక యొక కాలానికి గాని వర్తించునవి గావు. ఇవి స్వతః

ప్రమాణములు. అన్ని కాలాలకు, అన్ని ప్రాంతములకు, మానవులందఱకు మార్గదర్శక సూత్రములను బోధించు నట్టివి. ఇవి సహజీవనము, సఖ్యజీవనము, శాంతిమయ జీవనము, యజ్ఞమయ జీవనమును ప్రేరేపించును. మనువు మొదలుకొని జైమిని దయానందాదుల వరకు ఉద్భవించిన ఆప్త పురుషులెల్లరు వేదములు అపౌరుషేయములని, ప్రామాణికములని, సత్యవిద్యల గ్రంథములని అంగీకరించిరి. పాశ్చాత్యులు కూడా ఋగ్వేదము ప్రపంచ గ్రంథములలో ఆది గ్రంథముగా ఒప్పుకొనుచున్నారు. అట్టి వేదముల నుండియే ఉపనిషత్తులు, బ్రాహ్మణ, ఆరణ్యక గ్రంథములు, దర్శనములు ఆవిర్భవించినవి. వేదములు ప్రబోధించు ధర్మమునే ఆర్యసమాజము ప్రచారము చేయుచున్నది.

ప్రపంచమును యుద్ధవినాశము నుండి కాపాడుటకు దురాశ, దుష్టస్థితినుండి మరల్చుటకు, శాంతి, సౌభాగ్య,

సౌభ్రాతృత్వము నెలకొల్పుటకు ప్రతివారు యీ వేద సందేశమును చాటుటలో ఆర్యసమాజానికి సహకరించుట యెంతో అవసరముగా గుర్తించెదరు గాక!

భారతదేశము ఆర్యులకు నివాసస్థలము. అందుచేత దీనిని పూర్వము ఆర్యావర్తమని వ్యవహరించిరి. ఆర్యులు ఒక జాతికి జెందినవారు కారు. శ్రేష్ఠులు, ధర్మాత్ములు, పరోపకార పరాయణులు, సత్య విద్యల నెరింగినవారు ఆర్యు లనబడుదురు. అయిదువేల సంవత్సరములకు పూర్వము ప్రపంచమందంతట వేదధర్మమే ప్రచలితమై యుండెను. మత మతాంతరము లన్నియు యిటీవల వెలసినవే. హిందూశబ్దము యిటీవలి కాలమునకు జెందినదే. ఆర్యసమాజము హిందువుల సంస్థయను భ్రమ నెలకొనినది కాని యిది మానవతావాది. "మనుర్భవ" అను వేదాదేశ మును పాటించునది. మహర్షి దయానందుడు రచించిన సత్యార్థ ప్రకాశములో అన్ని మతములలో గల ధర్మ విరుద్ధ

ఆచారములతో బాటు హిందూమతములో గల దుష్టసాంప్ర దాయములను యెక్కువగా ఖండించెను.

వేదములు జీవాత్మ, పరమాత్మ, ప్రకృతి యను మూడింటిని ఆద్యంత రహితములని, అవినాశియని పేర్కొనుచున్నది. అట్టి త్రైతవాదమునే ఆర్యసమాజము ప్రతిపాదించు చున్నది.

1. పరమాత్మ :—

ఈ సృష్టిని రచించి జీవులకు కర్మఫలముల నొసం గెడు దివ్యశక్తియే పరమేశ్వరుడు. అట్టి పరమేశ్వరు డొక్కడే. అతడు అజరుడు, అమరుడు, సర్వాంతర్యామి, సర్వశక్తిమంతుడు నిరాకారుడని వేదములు ఘోషించు చున్నవి. అతడు సృష్టికి నిమిత్త కారణము. ఆయన ముఖ్యనామము "ఓ౩మ్" యనగా రక్షకుడు. బ్రహ్మ, విష్ణు, రుద్రుడు మొదలగు నామములన్నియు ఆతని గుణవాచ

కములు. ఆతడు అవతరించడు. ఆయన మందిరము లలో గాని, మసీదు, గురుద్వారము, చర్చి లేక క్షీర సాగరము, కైలాసము, వైకుంఠము లేక నాల్గవ, యేడవ ఆకాశమునందు నివసించడు. మనము చేసిన తప్పొప్పులకు ఫలము నిచ్చును. ఎవరి పాపములను క్షమించడు. గురువు పరమేశ్వరుని తెలుసుకొనుటకు మార్గదర్శకుడే గాని ఆతడే సర్వస్వము కాజాలడు.

పరమేశ్వరుని పొందుటకు సర్వోత్తమ మార్గము అష్టాంగ యోగము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అష్టాంగ యోగము లనబడును. ఇవియే మానవుని శారీరక, సామాజిక ఆత్మోన్నతికి సాధనములు.

2. జీవాత్మ :—

ఈశ్వరీయ నియమములకు లోబడి కర్మఫలము

ననుభవించుటకై జీవుడు భిన్న దేహములలో ప్రవేశించి కర్మఫలముల ననుభవించుచుండును. వీనినే జనన మరణము లందురు. జీవుడు నిత్యుడు, శాశ్వతుడు, అజరుడు అల్పసామర్థ్యము మరియు అల్పజ్ఞానము కలిగినవాడు. ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖ, జ్ఞాన, ప్రయత్నము లను గుణములు కలిగియుండును. తన కర్మ ఫలములను యెక్కువ తక్కువ గాకుండా అనుభవించును. ఇచ్ఛాశక్తి కలిగి యుండుటవలన కర్మజేయుటలో స్వతంత్రుడు కాని ఫలమనుభవించుటలో పరతంత్రుడై యున్నాడు.

3. ప్రకృతి :—

దృశ్యమాన (కనపడునట్టి) ప్రపంచము జడ చేతనములతో కూడియున్నది. సూర్య, చంద్ర, నక్షత్రాదులు మొదలుకొని పిపీలకాది బ్రహ్మఋషి పర్యంతము గల ప్రాణుల శరీరములకు ఉపాదాన కారణము ప్రకృతి. అది

శాశ్వతమైనది - పుట్టుకలేనిది కాని దీని రూపము మారు చుండును. ఇది పరమాణువుల సంయోగము. ఈ పరమాణువుల సంయోగ విభాగమే పృథివి, నీరు, అగ్ని, వాయువు ప్రకాశము. ఈ పంచభూతములచే విభిన్న జీవుల శరీరము లేర్పడుచున్నవి. అవి సత్వ రజ స్తమో గుణములు కలిగియున్నవి.

పైన వివరించిన ఆత్మ, పరమాత్మ, ప్రకృతులతో సృష్టి జరుగుచున్నది. వీనిలో యే యొకటి లేకున్నను యీ విశాల బ్రహ్మాండ మేర్పడెడిది కాదు. సృష్టి రచనను పరీక్షించినపుడు జీవుడు సృష్టిని రచించెడు సామర్థ్యము కలవాడు కాడనియు, ప్రకృతి దానంతటదియే సృష్టిగా మారుట జరుగదనియు తెలియుచున్నది. అందుచేత సృష్టిని రచించెడు కర్తయే పరమేశ్వరుడని, ఆతడు జీవునికంటె భిన్నముగా క్లేశకర్మ విపాకాశాయములచే అంటబడని వాడును, అపార జ్ఞానము కలిగినవాడుగాను గుర్తింపబడు

చున్నాడు. జీవుడు భోక్తగా యుంటున్నాడు. జీవులు భోగించుట కొరకే యీ సృష్టి రచింపబడినది.

ఈశ్వరుడు సృష్టిని రచించును. ప్రకృతి సృష్టి రూపములో పరివర్తన జెందును. సృష్టి, స్థితి, లయములకు కర్త ఈశ్వరుడే. జీవుని కర్మల ననుసరించి సుఖ దుఃఖ భోగముల ననుభవింప జేయుటకై యీ సృష్టి రచింపబడినది.

జనన మరణములు :—

జీవ ప్రకృతుల సంయోగమే జననము. వాని వియోగమే మరణము. కర్మలో లీనమగుట సహజము దానినే ప్రవృత్తి యందురు. ధర్మానుసారముగా అర్థ కామముల సాధించి మోక్షలక్ష్యము కలిగి యుండవలెను. జనన మరణ రాహిత్యమే మోక్షమనబడును. కర్మ జేయుచునే వైరాగ్యము పొందుట నివృత్తి యనబడును.

మానవుడు జేయు కర్మల ననుసరించి దేహమేర్పడును. కర్మ ఫలముల ననుభవించుటకు భిన్న యోనులలో జన్మించును. ప్రపంచము సుఖ దుఃఖమయ మగుటకు ప్రాణులు గావించు కర్మలే కారణము. ప్రకృతిలో త్యాగ, భోగ, కర్మలు రెండు విధములుగా నున్నవి. మనుష్యుడు యీ రెండు విధములైన కర్మలు జేయవలెను. ప్రపంచ భోగము పాపముకాదు. ప్రపంచ త్యాగము పుణ్యము కాదు. రెండు విధములైన కర్మలు ధర్మయుక్తముగా జేయుచు జీవితము గడుపుటయే యజ్ఞమయ జీవన మనబడును.

బ్రహ్మచర్యాశ్రమము ప్రవృత్తి సాధకము. గృహస్థాశ్రమము ప్రవృత్తి ప్రయోజకము. అట్లే వానప్రస్థాశ్రమము నివృత్తి ప్రయత్నము. సన్యాసాశ్రమము నివృత్తి సాధనా క్షేత్రము.

వర్ణాశ్రమములు :—

సామాజిక అభ్యుదయము కొరకై వేదానుకూలముగా వర్ణాశ్రమ వ్యవస్థ గావించబడినది. ఈ వ్యవస్థవలన సమాజములో "పరహిత" భావమేర్పడి స్వహితము కూడా సాధ్యమగును. మానవ సమాజములో ప్రచులితమైన దేశ, జాతి, సంప్రదాయ భేదభావములు కృత్రిమము లగుటవలన అందరకు బాధాకరమగును.

మానవ జీవనలక్ష్యము ధర్మ, అర్థ, కామ, మోక్షములు సాధించుటయై యున్నది. ఇందు బ్రహ్మచర్యము ధర్మసాధనకు, గృహస్థాశ్రమము అర్థకామములు సాధించుటకు, వానప్రస్థ సన్యాసాశ్రమములు మోక్షము సాధించుటకు ఉపయుక్తముగా నున్నవి. మానవ జీవిత సగటుకాలము 100 సంవత్సరములుగా పరిగణించి నాలుగు ఆశ్రమములలో విభజించనైనది. 1) బ్రహ్మచర్యము 2) గృహస్థము 3) వానప్రస్థము 4) సన్యాసము.

1. బ్రహ్మచర్యము :—

మొదటి 25 సంవత్సరములు కనీసము స్త్రీ పురుషులెల్లరు బ్రహ్మచర్యము పాటించవలెను. యోగ్యత కలిగినవారు 48 సంవత్సరముల ప్రాయము వరకు బ్రహ్మచర్యము పాటించవలెను. ఈ సమయమున గురుకులములలో విద్యాధ్యయనము, మనోవాక్కాయ కర్మలచేత యింద్రియ నిగ్రహము, శారీరక వ్యాయామము, ప్రాణాయామమువంటి సాధనలు చేయవలెను. బ్రహ్మచర్యాశ్రమము జీవిత సౌధమునకు పునాదివంటిది. ధర్మసాధన కుపయుక్తమైన కాలము.

2. గృహస్థాశ్రమము :—

బ్రహ్మచర్యాశ్రమము విధి ననుసరించి పాలించిన తదుపరి వివాహము తన గుణకర్మలకు సరిపోయిన వారిని జేసుకొని సృష్టికార్యమును కొనసాగించెదరు. యేబది

వత్సరముల ప్రాయము వరకు నియమబద్ధులై ధర్మాను సారముగా జీవితము గడిపినచో ఆరోగ్యవంతులై దీర్ఘా యువు కలిగినవారై యుందురు. బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములు స్వీకరించినవారు గృహస్థులపై ఆధార పడి యుందురు. అందుచేత గృహస్థాశ్రమము అత్యుత్కృ ష్టమైనది.

3. వానప్రస్థాశ్రమము :—

యేబది సంవత్సరములు దాటినవారు తమ తొలి సంతానమునకు బాధ్యత నప్పగించి వనములకు వెళ్లి సమాజ సేవాకార్యములలో నిమగ్నులు కావలసియుండును. ఈ ఆశ్రమము నివృత్తి మార్గమునకు ప్రయత్నరూపము ఇందు పరహితభావము యేర్పడును. మోక్షసాధనకు అనువైన కాలము.

4. సన్యాసము :—

75 సంవత్సరముల వయసు దాటినవారు నివృత్తి మార్గములో ధర్మప్రచారము జేయుచు దేశాటన గావించవలెను. అధికభాగము ఈశ్వరధ్యానములో గడుపవలెను. ఒక గ్రామమందుండుట కాని, వ్యామోహము పెంచుకొనుట కాని తగదు. మోక్ష సాధనకు పరిపక్వ కాలము.

సమాజము ఉత్తమపద్ధతిలో సంఘటితముగా నుండి అఖండమై అందరకు సమానావకాశములు కలిగించి జీవన భృతి సమకూర్చుటకై ఆర్యఋషులు శ్రమ విభాగము ఆధారముగా, వైజ్ఞానికముగా వర్ణవ్యవస్థ గావించిరి. విద్యారంభ కాలమునుండి విద్య సమాప్తి వరకు వారి వారి యోగ్యత ననుసరించి ఆర్జన సాగించుచు గృహస్థాశ్రమములో ప్రవేశించునపుడు వర్ణము నిర్ధారణ జరుగును.

బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములలో వర్ణముతో పనియుండదు. ఇహ లౌకిక వ్యవహారముల కొరకు మాత్రమే యీ వర్ణవ్యవస్థ గలదు. పారలౌకిక వ్యవహారములగు వేదాధ్యయనము, యజ్ఞము, దాన ధర్మములు, జపతపములకు యీ వర్ణవ్యవస్థ అడ్డుకాజాలదు. గుణకర్మల ననుసరించి సమాజమును నాలుగు వర్ణములుగా విభజించనైనది. 1) బ్రాహ్మణులు, 2) క్షత్రియులు 3) వైశ్యులు 4) శూద్రులు.

1. బ్రాహ్మణులు :—

ఉత్తమ విద్యనార్జించి, సద్గుణములు కలిగి దేశ ప్రజలకు జ్ఞానమును కలిగించు వేదములను చదువుచు చదివింప జేయుచు, యజ్ఞ యాగాది క్రతువులను జేయుచు, జేయించువారు బ్రాహ్మణు లనబడుదురు. ప్రజలలో మానవ ధర్మము, నీతి, సదాచారము, సంస్కృతీ సభ్యతలను

ప్రచారము జేయుదురు. వీరు జాతీయ ధర్మము, జాతీయ చైతన్యము, జాతీయ సంస్కృతిని వికసింపజేయుదురు.

2. క్షత్రియులు :—

ఉత్తమ విద్య నార్జించి, గుణవంతులై ఆపత్కాలములో ప్రజలను రక్షించి దుష్టులను సంహరించువారు క్షత్రియులనబడెదరు. వీరు దేశమును శక్తి సంపన్నముగావించెదరు.

3. వైశ్యులు :—

ఉత్తమ విద్య నార్జించి, సచ్ఛీలురై వ్యవసాయ, వ్యాపార రంగముల ద్వారా ధర్మయుక్తముగా ధనము సంగ్రహించి దేశమును ఆర్థికముగా పటిష్ఠము జేయువారు వైశ్యులనబడెదరు. వీరు దేశమును ఆర్థికముగా పటిష్ఠ మొనరింతురు.

4. శూద్రులు :—

మందబుద్ధులై, గుణవంతులై, విద్య నార్జించలేక శారీరకముగా పరిశ్రమ జేయుచు దేశమును సుసంపన్నము జేయువారు శూద్రులు. వీరు దేశ శ్రమశక్తిని వృద్ధిగావింతురు.

తర్కము, శ్రద్ధ, బుద్ధి, విశ్వాసము, ఆలోచన అను విషయములు మానవునకు పురోగమన మార్గము ననుసరించుటలో ఉపయుక్తమగును.

సత్యజ్ఞానము కొరకు తర్కము, చర్చ, ఆలోచన బుద్ధి ఆవశ్యకములు. జ్ఞాన సత్యములపై నడచుటకు అచంచల శ్రద్ధ అవసరము. శ్రద్ధా మేధల సమన్వయము కానంతవరకు సత్యమును తెలిసికొనుట కాని, సత్యము ఆచరించుట కాని జరుగదు, కేవలము తర్కమువలన జీవితము అస్తవ్యస్తమగును. కేవలము శ్రద్ధవలన జడత్వ

మేర్పడి ఉన్నతి ద్వారములు మూసివేయబడును. అందు చేత యీ సిద్ధాంతములు జీవితములో ఆచరణలో పెట్ట కుండినచో శాంతి సౌభాగ్యములు అసంభవమగును,

## పంచ మహాయజ్ఞములు

1. బ్రహ్మ యజ్ఞము :-

యోగాభ్యాసము, ఆత్మచింతన, ఈశ్వరోపాసన, స్వాధ్యాయము ద్వారా అంతఃకరణ శుద్ధి బ్రహ్మయజ్ఞ మనబడును. దీనివలన శిష్టాచారము, ధర్మము, ఉత్తమ గుణములు వృద్ధిజెందును.

2. దేవ యజ్ఞము :-

అగ్నిహోత్రము ద్వారా వాతావరణమును శుద్ధి యొనరించి గృహ పరిసరములను ఆరోగ్యప్రదముగా నుంచుట అనగా శారీరకోన్నతి జెందుట దేవ యజ్ఞము. దీని

వలన ఆరోగ్యము వృద్ధిజెంది బలపరాక్రమములు పెరిగి ధర్మార్థ కామమోక్షములు సాధించు సామర్థ్యము వృద్ధి జెందును.

3. పితృ యజ్ఞము :-

బ్రతికియున్న వృద్ధ తలిదండ్రులకు, యితర వృద్ధ కుటుంబ సభ్యులకు అన్నపాన వస్త్రములద్వార సేవ జేయుట. దీనివలన కృతజ్ఞతాభావము, సదాచారము వృద్ధిజెందును.

4. అతిథి యజ్ఞము :-

ధార్మికులు, పరోపకారులు, ధర్మోపదేశకులు, సాధు సన్యాసులకు అన్నపాన వస్త్రాదుల ద్వారా సేవ జేయుట. దీనివలన పాఖండ వినాశము, సత్యజ్ఞానము, ధర్మప్రచారము జరుగును.

5. బలి వైశ్వదేవ యజ్ఞము :-

గోవు, కుక్క, పిల్లి, చీమలు మొదలగు ప్రాణులకు మరియు నిర్ధనులు, అనాధలు నైనవారికి యథాయోగ్యముగా సేవలు జేయుట. దీనివలన ప్రాణులయెడ సమదృష్టి, పరోపకారబుద్ధి వృద్ధిజెందును.

సంస్కారములు :-

ప్రాచీన ఋషులు జీవిత ప్రతి కోణమును నియమ బద్ధము చేయు వ్యవస్థ గావించిరి. జన్మించినది మొదలు మరణ పర్యంతము వికాసము జెందుటకై సంస్కార పద్ధతిని ప్రవేశపెట్టిరి. గర్భాదానము మొదలు అంత్యేష్టి (శవ దహనము) వరకు పదునారు సంస్కారములుగా ప్రవేశ పెట్టిరి. 1) గర్భాధానము 2) పుంసవనము 3) సీమంతోన్నయనము 4) జాతకర్మ 5) నామకరణము 6) నిష్క్రిమణము 7) అన్నప్రాశనము 8) ముం

దనము 9) కర్ణవేధము 10) ఉపనయనము 11) వేదా రంభము 12) సమావర్తనము 13) వివాహము 14) వాన ప్రస్థము 15) సన్యాసము 16) అంత్యేష్టి.

ఇవి జీవిత కాలమంతయు విస్తరించి యున్నవి. ఆత్మను సన్మార్గములో పెట్టి సంస్కరించుటయే వీని లక్ష్యమై యున్నది. మనసు, శరీరము సుసంస్కృతమై ధర్మార్థ కామ మోక్షముల సాధన సులభ మగును. అందు చేత సంస్కారములు విధిప్రకారముగా నాచరించుట ప్రతి స్త్రీ పురుషుని కర్తవ్యము.

సమాజోద్ధరణ :-

నేటికి వంద సంవత్సరాల పూర్వమే ఆర్యసమాజ ప్రవర్తకుడు, మహోన్నత దూరదర్శి యనదగు మహర్షి దయానంద సరస్వతి సామాజిక దురాచారములను అంధ విశ్వాసములను, స్త్రీల నికృష్టదశను గాంచి దుఃఖితుడై

వాటిని రూపుమాప కంకణబద్ధుడయ్యెను. తన తరువాత యీ కార్యక్రమములు కొనసాగుటకై ఆర్యసమాజమును స్థాపించెను. అస్పృశ్యతా నివారణ, కులమత భేద నిర్మూలన, స్త్రీ విద్య, విధవావివాహము, బాల్య వృద్ధ వివాహ వ్యతిరేకత, బహుపత్నీప్రథ నిరోధము వంటి కార్యక్రమములు చేపట్టెను. గోహత్య, పశుబలి వంటి వానిని నిరసించెను. కాని నేడుకూడా గోహత్య, శిశుహత్య, నరహత్య విపరీతముగా జరుగుచుండుట, వరకట్న హత్యలు క్షమింపరాని విధముగా జరుగుచుండుట శోచనీయము. ఆ మహర్షి ఆశించిన ఆర్యచక్రవర్తి సార్వభౌమిక రాజ్య లక్ష్యమునకు తిలోదకము లిచ్చుటయే వీటికి కారణము.

విదేశీయులద్వారా జరుపబడు సామాజిక, రాజకీయ ఆర్థిక దమన నీతిని గర్హించెను. పురుష సింహము మాదిరి మహర్షి దయానందుడు దమననీతిని సాధ్యమైన రీతులలో

యెదుర్కొనుటకు రంగమున దూకెను. అబూ పర్వతము నుండి ఢిల్లీ, హరిద్వారము వరకు కాలినడకన ప్రయాణము సాగించెను. ప్రథమ స్వతంత్ర సంగ్రామ సేనానులైన నానాసాహెబు, బాలాసాహెబు, అజీముల్లాఖాన్, తాంత్యా తోపే, కుంవర్ సింహ, మహారాణి లక్ష్మీబాయి మొదలగు ప్రముఖులు దయానందుని కలిసిరి. దయానందుడు వారికి విప్లవ భావములను, ప్రేరణను మరియు క్రాంతికారియైన కార్యక్రమముల నిచ్చెను. సామాన్య సన్యాసులలో మరియు సామాన్య ప్రజలలో స్వదేశ, స్వధర్మ రక్షణకై ప్రచారము చేయుచుండిరి. అన్ని సాంప్రదాయములకు జెందిన సన్యాసులను, మహంతులను కలిసి స్వతంత్ర సంగ్రామములో పాల్గొనుటకు ప్రార్థించిరి. సన్యాసుల సంఘటనకై ప్రయత్నించుచు వారిని సైనిక శిబిరములకు స్వతంత్ర ప్రచారమునకై పంపించుచుండిరి. ఈ సంఘటన యొక్క గుప్తకేంద్రము ఢిల్లీలో మెహరౌలీలో గల యోగమందిరమై

యుండెను. ఈ కేంద్రమునుండియే దేశ వివిధ ప్రాంతము లకు రహస్య సూచనలు పంపబడుచుండెను. రొట్టె, కమలముల ద్వారా విప్లవ సందేశము జేరవేయబడుచుండెను. మహర్షిచే ప్రేరితుడైన మంగల్‌పాండే ఆవేశముతో 29 మార్చి 1857 రోజు తమ ఆంగ్ల అధికారులైన సార్జెంటు హ్యూసన్‌ను, లెఫ్టినెంటు బాహ్‌ను తన గుండ్లకు బలి చేసెను. ఫలితముగా ఆంగ్లేయులు మంగల్ పాండేకు ఉరిశిక్ష నొసంగిరి. నానాసాహెబు, తాంత్యాతోపే, వీరాంగన ఝాన్సీ లక్ష్మిబాయి, కుంవర్‌సింహ, అజీముల్లాఖాన్, మొగలు పాలకుడు బహదూర్‌షా జఫర్ మొదలగువారి నాయకత్వములో భారతీయ సైనికులు ఆంగ్లేయులను వీరోచితముగా యెదుర్కొని వారి రాజ్యపు వేళ్లను కదిలించిరి.

దురదృష్టవశాత్తు యీ సైనిక విప్లవము విఫలమయ్యెను. స్వామీజీ తన కన్నులతో స్వతంత్ర సైనికు

లను తోపులకు గట్టి కాల్చివేయుటను, వేలమందిని కూడ గాలిలో చెట్లకు గట్టి హింసించుటను గాంచి నెత్తురు కాగెను. ఆంగ్లేయుల యీ క్రూరకృత్యములతో వారి హృదయము ద్రవించి దుఃఖించెను. కలకత్తాలో "లాట్" ఫాదరీ స్వామీజీని అప్పటి వైస్రాయి నార్థ్ బ్రూక్‌తో కలిపెను. అతడు స్వామీజీని ఆంగ్లేయుల పాలన భారతదేశములో స్థిరముగా నుండునట్లు పరమేశ్వరుని ప్రార్థించుమనెను. అంత స్వామీజీ నిర్భయుడై తాను దేశ స్వతంత్రము కొరకు, ఆంగ్లేయ రాజ్య వినాశము కొరకు ప్రార్థిస్తానని చెప్పెను.

"సత్యార్థ ప్రకాశము"లో పేర్కొనిన సంపూర్ణ స్వాతంత్ర్య విషయ బీజారోపణ వైస్రాయి నార్థ్ బ్రూక్ వద్దనే జరిగెను. స్వామీజీచే వ్రాయబడిన "సత్యార్థ ప్రకాశము" ఆంగ్లేయుల పాలన ప్రవేశ్లానుకొనిన కాలము. స్వతంత్రము, స్వరాజ్యమును గూర్చిన ప్రస్తావన రాజ

ద్రోహముగా పరిగణించ బడుచుండెను. సత్యార్థ ప్రకాశములో ఒక సముల్లాసము మొత్తము "రాజధర్మమును" గూర్చి వివరించిరి. ఆ రోజులలో ప్రభుత్వ కార్యాలయాలలోనికి స్వదేశీ చెప్పులతో వెళ్లుటకు వీలులేకుండెను. ఈ విషయము దయానందునకు బాధాకరముగా నుండెను. స్వదేశీ చెప్పులను నిరసించువారు యీ దేశ మనుష్యులను యెంత నీచముగా చూచుచున్నారో గ్రహించవలసినదిగా హెచ్చరించిరి. ఆంగ్లేయులు రెండుచేతులతో దేశ సంపదను దోచుకుంటున్నారని వాపోయెను.

మహర్షి స్వదేశ, స్వరాజ్యముల గూర్చి గావించిన ప్రచారము జాతీయ కాంగ్రెసుకు వేదికను సిద్ధపరచెను. "సత్యార్థ ప్రకాశము" చదివి ఆర్యసమాజికులుగా మారిన గోవిందరానడే, గోపాలకృష్ణ గోఖలే, పం. శ్యామ్‌జీ కృష్ణ వర్మ, స్వామీ శ్రద్ధానంద్, లాలా లజపతిరాయ్, భాయీ పరమానంద్, పం. రాంప్రసాద్ బిస్మిల్, అమర్ షహీద్

భగత్‌సింహ వంటి వీరులు స్వతంత్ర సంగ్రామములో ప్రవేశించినందువలన ఉద్యమము తీవ్రస్థాయికి జేరెను. మౌలానా హస్రత్ మోహన్ మాటలలో 90 శాతము ఆర్య సమాజీకులు స్వతంత్ర సంగ్రామములో దూకిరి.

మహర్షి "మనుర్భవ" వేదాదేశానుసారము మానవ ధర్మమును ప్రకటించెను. అన్ని మతములలో గల దుష్ట సాంప్రదాయములను, అంధ విశ్వాసములను, వేద విరుద్ధ చర్యలను తీవ్రముగా ఖండించెను. అన్ని మతముల వారిని సమావేశపరచి అందరికి ఆమోదయోగ్యమగు ధార్మిక సిద్ధాంతములను మానవులందరకు ఉపయోగకారి యగునట్లు క్రోడీకరించుటకు ప్రయత్నించెను. కాని అట్టి ప్రయత్నము సఫలము కాలేదు. వారి ప్రయత్నమునకు మన దేశ సన్యాస సంఘములే తోడ్పడలేదు.

వేద విజ్ఞానము మరుగునపడిన రోజులలో ఆంగ్లేయులు క్రైస్తవ ప్రచారకుల సహాయముతో వేదములకు

విపరీతార్థములు కల్పించిరి. వేదములలో యెట్టి విజ్ఞానము లేదనియు అవి కేవలము భిక్షకులు పాడుకొను పాటల వంటివేయని మాక్సుముల్లరు వంటి వారిచేత వ్రాయించిరి. వారికి దేశీయ పండితులు కొందరు సాయణాచార్యులు, ఉవ్వటుడు వంటి వారు తోడ్పడిరి. అట్టి సమయమున మహర్షి దయానందుడు వేదములు అపౌరుషేయములనియు, సమస్త సత్యవిద్యల గ్రంథమనియు, విజ్ఞాననిధి యనియు శాస్త్రోక్తముగా నిరూపించెను. వేదములలో నిక్షిప్తముగా నున్న విజ్ఞానమును ప్రకాశము గావించెను. వర్ణాశ్రమ ధర్మములు వ్యవస్థ కెట్టి పునాదులో నిరూపించెను. వేదములలో చరిత్ర లేదనియు, వేదములలో గల పేర్లను తర్వాతకాలమువారు ధరించుటవలన యిట్టి భ్రమ కలిగిన దనియు, ఆయా శబ్దముల అర్థమును సహేతుకముగా వివరించిరి. యజ్ఞములు వైజ్ఞానిక ప్రక్రియయనియు, వాతావరణ కాలుష్యాన్ని నివారించుటకు తోడ్పడుననియు నిరూపించెను.

మానవమాత్రులెల్లరు స్త్రీ పురుషాదులు యజ్ఞోపవీతమునకు అధికారులే యనియు, యజ్ఞము, గాయత్రీ మంత్రోచ్చారణ కర్హులనియు వేదమంత్రముల ద్వారా చాటెను. విగ్రహారాధన వేద సమ్మతము కాదనియు, దానివలన ఏకాగ్రత యేర్పడ దనియు పరమేశ్వరుడు నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి యనియు చాటెను. ఇట్లు ప్రాచీన వేద విజ్ఞానమును లోకమునకు చాటి దిగ్భ్రాంతుల నొనర్చెను. వేదములకు తిరిగి గౌరవస్థానము కలిగించుటకు మహర్షియే కారకుడని నిరాటంకముగా చెప్పవచ్చును. వైదిక సంస్కృతి నేడు విదేశాలలో వ్యాపకము జెంది గౌరవము కలుగుటకు మహర్షి కృషి, తపస్సు కారణము.

మహర్షి వైదిక ధర్మ ప్రవేశద్వారాలు అందరికొరకు తెరిచెను. అప్పటివరకు విమతీయులకు, విదేశీయులకు వైదిక ధర్మ ప్రవేశద్వారములు మూయబడియుండెను.

వైదిక ధర్మానుయాయులనేకులు విమతముల లోనికి యిందు చోటుచేసుకొనిన అంధ విశ్వాసములకు, సంకుచిత భావములకు నిరసనగా ప్రవేశించుచుండిరి. స్త్రీలు ముఖ్యముగా అనేక బాధలకు గురి చేయబడుచుండిరి. బాల్య వివాహములు, వృద్ధ వివాహములు స్త్రీలపాలిటి శాపముగా నుండెడివి. భర్తృవియోగము పొందిన స్త్రీ సంఘములో చాలా దారుణ బాధలకు గురిచేయబడి హింసించబడుచుండెను. ఆమెకు పునర్వివాహ అధికారము లేకుండెను. అట్టి స్త్రీకి సముచిత స్థానము సమాజమునందు కల్పించబడెను. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అను మనుస్మృతి వాక్య మాధారముగా బాల్య వివాహములు నిషేధింపబడెను. పునర్వివాహ అధికారమొసంగబడెను. స్త్రీకి వేదపఠనాధికారము, విద్యనార్జించు అధికారము ఒసంగబడెను. ఇట్లు అన్య ధర్మములలోనికి పవేశమును ఆటంకపరచుటయే గాక విధర్మములలోనికి

పోయినవారికి తిరిగి వైదిక ధర్మములోనికి ప్రవేశము సుళువు గావించెను. మహర్షి ప్రధాన అనుయాయుడైన స్వామి శ్రద్ధానందుడు కొన్ని లక్షలమందిని వైదిక ధర్మము లోనికి ప్రవేశపెట్టెను. వారు స్థాపించిన సంస్థ "భారతీయ హిందూ శుద్ధి సభ" ద్వారా యిప్పటికీ ఆ కార్యక్రమము నిర్విఘ్నముగా జరుగుచున్నది.

విద్యారంగములో విప్లవాత్మకమైన మార్పు తెచ్చుటకు ప్రయత్నించెను. ప్రాచీన ఆర్ష ప్రణాళిక, గురుకుల పద్ధతి ప్రవేశపెట్టెను. అనేక గురుకులములు నేడు మనము గాంచుచున్నాము. గురుకులములలో సత్సంప్రదాయము, బ్రహ్మచర్యము, సచ్ఛీలము మున్నగునవి అభ్యాసము చేయించుచున్నారు. ఆధునిక విద్యా పద్ధతిని బోధించుటకు దయానంద ఆంగ్లో వర్నాకులర్ పాఠశాలలు నెలకొల్పబడినవి. వీటి అనుబంధశాఖలు విదేశాలలో

కూడా గలవు. ఈ పాఠశాలలు దేశ, విదేశాలలో ఖ్యాతి నార్జించినవి. ఇంతవరకు క్రైస్తవ మిషనరీల యాజమాన్యములో విస్తరిస్తున్న పాఠశాలలకు యీ గురుకులములు, దయానంద ఆంగ్లో వర్నాకులర్ పాఠశాలలు అడ్డు తగిలినవి. స్వామి శ్రద్ధానందుడు తన ఆస్తినంతా అమ్మి స్థాపించిన కాంగ్డీ గురుకులము యిప్పటికి శోభాయమానముగా నడుచుచున్నది. ఇప్పుడు అనేక ఆర్ష గురుకులాలు నైష్ఠిక బ్రహ్మచారులను తయారు జేయుచున్నవి.

"మానవసేవయే మాధవ సేవ" అను సూక్తి ననుసరించి ఆర్యసమాజము అనేక సేవాసంస్థలు నెలకొలిపినది. అనాథశరణాలయాల ద్వారా అనాథ బాలబాలికలకు వైదిక విజ్ఞాన సంస్కృతి బోధించబడుచున్నది. ఔషధములు తయారు జేయబడుచు రోగులకు సేవాచర్యలు జేయబడుచున్నవి. స్త్రీల సేవాసంఘాలు స్థాపించబడినవి. కన్యా గురుకులాలు పనిజేయుచు స్త్రీలకు సమాన విద్యావకాశాలు

యివ్వబడినవి. అంతర్వర్ణ అంతర్జాతీయ వివాహాలు జరిపించబడుచున్నవి. యోగ సాధనా శిబిరాలు నెలకొల్పబడి యోగ విద్యయందు శిక్షణ యివ్వబడుచున్నది.

ఇట్లు మానవ సేవాదృక్పథముతో శిష్టాచారము. సత్ప్రవర్తనకు ప్రాధాన్యత నిచ్చుచు పనిజేయుచున్న ఆర్యసమాజ వటవృక్షము నాలుగువైపుల విస్తరించుచున్నది దేశ, విదేశాలలో కొన్ని వేల శాఖలు పనిజేయుచున్నవి, అనేక గ్రంథములు ప్రచురించుచు సాహిత్య కాలుష్యమును, దూరము జేయుచున్నది. "సత్యార్థ ప్రకాశము" అనేక భాషలలోనికి అనువదించబడినది. వేదములు కూడా అనేక భాషలలోనికి అనువదించబడుచున్నవి. ఇట్లు ఆర్య సమాజము పాఖండులను, పాఖండ మతములను యెదుర్కొనుచు ఒంటరిగా పోరాడుచున్నది. ధనాభావము యేర్పడినప్పటికి ఉన్న వనరులతో సాధ్యమైనంత కృషి సలుపుచున్నది.

కొంతమంది స్వార్ధపరులు, సంకుచిత స్వభావపరులు యీ సంస్థకు విఘాతము కల్పించుటకై యిందులో ప్రవేశించి విచ్ఛిన్న కార్యక్రమములు జరుపుచున్నారు. అయినప్పటికి ధర్మము జయిస్తుంది.

"యత్ర ధర్మో స్తతో జయః ॥"

# ఆర్య సమాజ నియమములు

౧. సమస్త సత్య విద్యలకును విద్యవలన తెలియనగు సమస్త పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

౨. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వ శక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనంతుడు, నిర్వికారుడు, అనాది, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వ వ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించ దగును.

౩. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట మఱియు వినుట, వినిపించుట ఆర్యులందఱికి పరమ ధర్మము.

౪. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించు టకును యెల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.

VEDAMULU CHEPPU DHARMA MEMI?

GAYATRI SERIES - 13 Rs. 1-00

---

౫. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యముల నాలోచించి చేయవలెను.

౬. ప్రపంచమునకు ఉపకారము చేయుట అనగా శారీరక, ఆత్మిక మఱియు సామాజిక ఉన్నతికి పాటుబడుట యీ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము.

౭. అందరితో ప్రేమ పూర్వకముగ, ధర్మానుసారముగ యథాయోగ్యముగ వ్యవహరింపవలెను.

౮. అవిద్యను నశింపజేసి, విద్యను వృద్ధి చేయవలెను.

౯. ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి జెందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంచవలెను.

౧౦. సర్వ హితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.